దుర్గాప్రియవల్లభయో
స్వర్గాధిపవంధ్యనిన్ను సతము భజింపఁ
భార్గవు డెంతటిపుణ్యుడో
భర్గా నినుగొల్చిగాదె వరలుటసాంబా ॥ 36

ఆగ్రముమాని వినుమిక
నుగ్రుడవని జడియ నొక్క నుక్తియు దొరకెఁ
నుగ్రాయా పంచేంద్రియ
నిగ్రహులగు వారిచెంత నిలచెదసాంబా ॥ 37

కరిమోమట నీసుతునిది
కరిచర్మమునీవు పయిసిగప్పెదవట నీ
విరతము నెక్కెడి చెదట
పరిహాసముగాదె యిట్టి పనులిలసాంబా ॥ 38

తిట్టినదిట్టవు పడపడి
కొట్టెదనన కొట్టరావు కోరినకోర్కుల్
నెట్టవుయిడనని భక్తుల
పట్టున నెపుడుందువహహా బాగుగసాంబా ॥ 39

అక్కట పద్మిమదగనాంబుల
జిక్కియు మరి దాసజనుల సేమములెన్నఁ
మక్కువమరచితివాయిటు
గ్రక్కున రాగదెవెనన్ను గావగసాంబా ॥ 40

శాశ్వతమగు ఈశ్వరుడవు
విశ్వము సృష్టించినావు వేయేలనభో
గీశ్వర భూషణనాపై
విశ్వాసము నుంచుమయ్య విసువక సాంబా ॥ 41

జంగమలింగ యనంగవి
భంగా కరుణాతరంగ భవహరలింగా
శృంగారగాత్ర యాశ్రిత
గంగజటాఝూట కాలకంఠిత సాంబా ॥ 42

మారీతి నీదగు భక్తుల
మీరీతి గురునాజ్ఞబుధుల మిగిలితినే నా
చ్చారిత్రములెన్నో తెలియక
యేరీతిని నన్ను బ్రోవ నెంతువొ సాంబా ॥ 43

కుశలముగనున్న దినముల
వశమాపట్టంగసరుల వలదప్పినచో
పశుపతి బ్రోవుమటందురు
దశదోలగిననాడు నీవె దాతవు సాంబా ॥ 44

స్వామీ యాపదబాపుము
యేమెరుగమటంచు మ్రొక్కులిడి యాపిదప
నీమహిమమెన్న భక్తుల
మోమరసియు నవ్వుచుంద్రు పుడమిని సాంబా ॥ 45

ఓం.

శ్రీఉమామహేశ్వరాయనమః.

# సాంబశతకము



ఇది

వసట్లూరు కోటయామాత్యా[redacted]చే

రచియింపఁబడియె.

ప్రథమ ముద్రణము 1000 ప్రతులు.

కాపీరైటు రిజిష్టర్డు. 1931 వెల 0—1—0

# సాంబశతకము

శ్రీ కరుణాకరధీర ది
వాకర శశివహ్ని నేత్రి హరిసన్మిత్రా
నాకనుత సంతతము
ల్లోకస్తుత దివ్యఫాలలోచన సాంబా॥ 1

ధీవరులకు కవివరులకు
నేవందనమాచరించి నీపైకృతినీ
యేవిరచింపగ బూనియు
భావంబుననిడితి నీదెభారము సాంబా ॥ 2

గణములు ప్రాసలు యతి ల
క్షణములు పదదోషములును సత్కార్యము లా
ఫణితి నెరుంగను నెట్టిదొ
ప్రణుతించితిగాని నీదెభారము సాంబా ॥ 3

శ్రీ గౌరీహృదయేశ్వర
వాగీశప్రముఖచక్రవందితచరణా
భోగీశాకర కంకణ
యోగీహృదయావిహారయున్నత సాంబా ॥ 4

ఏమోయి భక్తవరదా
కామితములునివ్వ నీకు గాంక్షయులేదా
నీ మృదుపదములు నమ్మితి
స్వామీ నన్నేట్టులైన సాకుము సాంబా ॥ 5

మత్తేభవరద వినుతా
చిత్తజసంహార సుగుణశీల విలోలా
మత్తుధన్నై తిని నీదగు
బత్తిని నాకొసగుమయ్య బాగుగసాంబా ॥ 6

త్రిభువనముల పోషించెడి
ప్రభుడవు సర్వేశ్వరుడవు పరమేశ్వర నా
కభయముసంగవదేమిర
విభవమునకుగాదె నిన్ను వేడుటసాంబా ॥ 7

నను బ్రోవరార భక్తా
శ్రిని బ్రోచినబిరుదుగాదు లేరా లేవ
హానభూషయింక జాగే
లనురా నినునమ్మినార లాలితసాంబా ॥ 8

మొక్కగ వరమీయుటకై
ముక్కంటీ నీకుజూడ ముజ్జగములలో
నొక్కండు గలడె వెదకిన
నక్కజముగ వేల్పులందు నహహాసాంబా ॥ 9

మృత్యుంజయ యనునామ మ
నిత్యులువచియించినారు నీ వేనిజమా
మృత్యువును గెల్చినావని
యత్యద్భుతమయ్యె నీమహత్యముసాంబా ॥ 10

అత్తరి భగీరథుండను
నుత్తముడలగంగ నెంచి యుర్వీస్థలికిన్
బత్తితో దెచ్చెడి గంగను
నెత్తిన ధరియించితౌర నేర్పునసాంబా ॥ 11

ఏమిఘనమయ్య నీకిది
భామల మెడదాల్చినావు భగవంతుడవా
స్వాములకెల్లను సామివె
భూమిని నినుబొగడవశమె బుధనుతసాంబా ॥ 12

శవములగాల్చిన బూడిద
నవిరళముగ దేహమందు నలదెదవౌరా
భవుడా మలయజముండగ
నవురా నీకిట్టి సౌఖ్యమబ్బెనుసాంబా ॥ 13

దారిద్రుడవని యందురు
ధారుణిగలజనులు తారతమ్యమెరుగక
కోరిన భక్తాగ్రేసరు
లేరీతిని నెగడుచుండ్రి యెరుగరుసాంబా ॥ 14

మరితము లెన్నియొనర్చిన
చిరకాలము మరపులేక జెలగెడిమతితో
ధరణి నిను గొల్చువారికి
యరుదా కైవల్యపదవి నబ్బుటసాంబా ॥ 15

ఇమ్ముగ సత్కవిపాలిటి
సొమ్మవుమరిగాకనీదు సుతుడుగణేశుం
డమ్మహనీయుడు మాదగు
సొమ్మగద నీవుమాకు సులభముసాంబా ॥ 16

రుద్రాక్షలు విభూతియు
భద్రముగధరించి నీకుభక్తుడనై నా
క్షుద్రము బాపుమటంటిని
రుద్రాయమునికినిజాంకి గూషిగసాంబా ॥ 17

చేసెదవింకను నీనిజ
దాసులసహవాస మబ్బుదాకను నిత్యా
భ్యాసము జేసెదనలకై
లాసము వీక్షించుకోరిక ప్రాప్తముసాంబా ॥ 18

యెన్నగ కాలుని దూతల
దన్నితివరకాలసర్వదా నినుగొల్వన్
మున్నా మార్కండేయుని
పున్నెము బొగడంగవశమె పుడమివిసాంబా ॥ 19

కృత్రిమమెరుగక తొల్లిట
చాత్రించరుకభయమివ్వ రక్కసుడంతన్
పాత్రత దెలియకనీకే
శత్రుండయె నెంతవింత జరిగెనుసాంబా ॥ 20

నిత్యము నృత్యము జేయుచు
నిత్యానందమున నుండు నిష్కపటినటా
సత్యము శాంతము ధర్మము
నిత్యము నీకియతియట గిరీశా సాంబా ॥ 26

ఒక్కటి శాంతము మరియుం
గొక్కటి ధర్మంబు నిజము పుష్కలగుణముల్
లెక్కగొను నాడెడిలలో
నిక్కముగా సరయువాడు నీవే సాంబా ॥ 27

పరకాంతలగని వలచితి
పరధనముల కాసపడితి పాపుడనైతీ
కొరగానివాడనైతీ
పురహర ననుగావు నీకు పుణ్యము సాంబా ॥ 28

నిగమములు నీవనీవే
నిగమంబులటంచు విబుధనికము దెలుపఁ
దగుదువటంచును ననుగా
వగ నీదరిజేరినాడ బాగుగ సాంబా ॥ 29

క్రతువులు వ్రతములు దానము
లతులితపుణ్యములు తీర్థయాత్రలు సలుపఁ
సతతము నినుభజియించెడి
మతిమంతుల సాటిగలరె మహిలో సాంబా ॥ 30

మన్ననమర్యాదెరుగక
పిన్నలపెద్దలను వెతలుబెట్టితి బహుగా
మన్నింపుము నీబిడ్డడ
సన్నా పెరవానిరీతి నరయక సాంబా ॥ 31

బుద్ధిని నిల్పియు సతతము
శ్రద్ధగ పఠియించి నీదుస్తవమొనరింపక
బద్ధుడనౌదట భక్తుల
పదను వసియించి నెప్పు వదలక సాంబా ॥ 32

జననీ జనకుడ నీవే
ఘనగురుడవు నన్ను బ్రోచుకర్తవు నీవే
యనియెడి యాశలుగొంటిని
నినునమ్మి మనంబులోన నిజముగ సాంబా ॥ 33

నిటలాక్ష భక్తరక్షా
కుటిలజనాధ్యక్ష శిక్షకోవిదపక్షా
దిటవుగనీపై దీక్షా
పటుతరముగ నిల్పినాడ భక్తితో సాంబా ॥ 34

భక్తులవిముక్తి జేయగ
శక్తియు నీయందె గలదు సర్వము నీవే
ముక్తినొసంగెద వందురు
భక్తాగ్రేసరులు పెక్కుభంగుల సాంబా ॥ 35

దుర్గాప్రియవల్లభయో
స్వర్గాధిపవంద్య నిన్ను సతము భజింపక
భార్గవు డెంతటి పుణ్యుడొ
భర్గా నినుగొల్చిగాదె వరలుట సాంబా ॥ 36

ఆగ్రముమాని వినుమిక
నుగ్రుడవని జడియ నొక్క నుక్తియు దోరకే
నుగ్రాయా పంచేంద్రియ
నిగ్రహులగు వారిచెంతి నిలచెద సాంబా ॥ 37

కరిమోమట నీసుతునిది
కరిచర్మము నీవు పయినిగప్పెదవట నీ
విరతిము నెక్కెడి చెదట
పరిహాసముగాచె యిట్టి పనులిల సాంబా ॥ 38

తిట్టినదిట్టవు పదపడి
కొట్టెదనన కొట్టరావు కోరినకోర్కుల్
నెట్టవుయిడనని భక్తుల
పట్టున నెపుడుందువహహ బాగుగ సాంబా ॥ 39

అక్కట పశ్చిమదగనాంబుల
జిక్కియు మరి దాసజనుల సేమములెన్నక
మక్కువమరచితివాయిటు
గ్రక్కున రాగదె వెనన్ను గావగ సాంబా ॥ 40

శాశ్వతమగు ఈశ్వరుడవు
విశ్వము సృష్టించినావు వేయేలన భో
గీశ్వర భూషణనాపై
విశ్వాసము నుంచుమయ్యా విమవకసాంబా ॥ 41

జంగమలింగయనంగవి
భంగాకరుణాతరంగ భవహరలింగా
శృంగారగాత్రయాకస
గంగజటాజూట కాలకంఠీశసాంబా ॥ 42

మారీతి నీడగుభక్తుల
మీరీతి గురునాజ్ఞబుధుల మిగిలితినే మ
చ్చారిత్రమాతెన్నో దెలియక
యేరీతిని నన్నుబ్రోవ నెంతువొసాంబా ॥ 43

కుశలముగనున్నదినముల
పశమాపట్టంగసరుల వలదప్పినచో
పశుపతి బ్రోవుమటందురు
దశదొలగినవాడు నీవెదాతవుసాంబా ॥ 44

స్వామీ యాపదబాపుము
యేమెరుగమటంచు మ్రొక్కులిడి యాపిదవ
నీమహిమమెన్నుభక్తుల
మోమరసియు నవ్వుచుంద్రు పుడమినిసాంబా ॥ 45

నేరిచినేరకయును మది
పారాయణ జేతునీదు పతనముశంభో
మారాడవలదు రమ్మిక
గోరాధ్వాహాన ఘనంబుగోరితిసాంబా ॥ 46

ఆసకు నిల్కడగలదా
నీసేవకు మితముగలద నిరతముగొల్వ౯
దాసులకు ఘనతగలదా
కాసులపై నీకుప్రేమగలదాసాంబా ॥ 47

ఉన్నది తినుటకునన్నము
వున్నవి ధరియింపవస్త్రములు దలపంగా
నన్నియునీదగుభక్తికి
సున్నగదా లేదుఫలము సుంతయుసాంబా ॥ 48

ఒడలెరుగక నీదాసుల
గడుదూషణ జేయుఖలుడు కాలునిపురిలో
వడిగల రంపపుకోతల
బడుటది నిక్కంబుగాదె భవహరసాంబా ॥ 49

పెట్టుమని యడుగుబీదల
దిట్టెడి కొట్టెడిఖలుండు దినకరసుతుచే
నెట్టింపఁగాగు నూనెల
తొట్టియలందునను బడగఁద్రోతురుసాంబా ॥ 50

దేవుడు యీశుడుగాడని
కేవలముగ బల్కువారు కింకర గదలన్
లేవగనీయక బాదుత్తురు
కైవల్యము బండిసున్నగాగను సాంబా॥ 51

ఆడుచు బాడుచు నీనుతి
వేడుకలను జేయుచున్ నవీనముగాగన్
గాడునది పాడుచుండిన
వాడే నిను జేరుతుదకు బాగుగ సాంబా 52

కొవ్వున నిను నుతియింపక
నొవ్వగ దాసులకు బాధలొనరించుచుదుష్టుల్
నెవ్విధి మోక్షముగాని వా
రవ్వల దరియించుటెట్లొ నరయుగ సాంబా॥ 53

వరముల నిచ్చెదవౌరా
సురమరలేకుండ నెట్టి యధముసకైనన్
ఈపరి నినుభజియించితి
పురహరనను గావవేల పుత్రుని సాంబా। 54

పాండవమధ్యముతోడను
భండనమొనరించి వాని బాహుబలంబున్
కొండంతగగని వానికి
పండుగ నొసగితివి పాశుపతమును సాంబా॥ 55

దాగితివా నను బ్రోవగ
యోగులహృదయంబునందు నున్నతశక్తిన్
నాగోలకు జంకితివా
త్యాగివి మరి గావలేద దర్పము సాంబా ॥ 56

సతతము నీదగు నామము
స్తుతియించెడి మతియు లేదు జూడగ నాకే
గతులు నొనర్తువొ నాదగు
బ్రతుకెట్టులొ దెలియ పతితపావన సాంబా ॥ 57

నినుగాంచలేని కన్నులు
నిను నొకతూరియు భజింపనేరని జిహ్వా
నిను వినవట్టియు వీనులు
ఘనముగవినియుండి యేమిఘనముర సాంబా ॥ 58

పురహర సర్వేశ పరా
త్వరయని నినుదలపనట్టి పాపులు ధరలో
ఖరకరు సత్పుత్రునిచే
కరపాదంబులు వధింపగందురు సాంబా ॥ 59

ఒకసారి నీదునామము
ప్రకటితముగ దలచువాడు భక్తుడు యనుచుం
బ్రదికనెల్ల వేళలందున
మొకమోటము లేక గొలువబూనితి సాంబా ॥ 50

భిక్షాం దేహీయని నే
మోక్షముకు నీదు పాదములు శిరమందున్
దీక్షతో నిల్పి భజించితి
రక్షింపుము నన్ను భక్తరక్షకసాంబా ॥ 61

అందర కవులకు నీదుసు
తుండును మరియునీదుసతియు నున్నతగౌరీ
కొండరభక్తులయెడనీ
వుండెదవుర వెనుకముందు నోర్చియుసాంబా ॥ 62

తనయులొనర్చెడు తప్పులు
జనకులు మన్నింతురవని సర్వేశ్వర నీ
తనయుడ ననుబ్రోవర పా
వనచరితా సుగుణభక్తవత్సలసాంబా ॥ 63

ఎంత దురాదృష్టుండనొ
సుంతయు బొడగానరావు చూడ్కులకెదుటన్
పంతమునాతో భక్తుల
స్వాంతమునందుందువంద్రు సగుణులుసాంబా ॥ 64

కులమేటికి స్థలమేటికి
బలమేటికి దలపనీదుభక్తియొనర్పన్
కొలదిదినంబులలోపల
దిలకించుర నీదుదివ్యతేజముసాంబా ॥ 65

పెక్కండ్రబ్రోచువానికి
లెక్కా నేనొక్కరుండ లీప్సలొసంగన్
గ్రక్కున బ్రోవరయేనిం
కెక్కడి కేగెదను దారియేదిర సాంబా ॥ 66

ఘోరసంసారమనియెడి
పారావారమున మునిగిపాపుడనైతిన్
రారమ్ము తేల్చ నీదే
భారము రాయింక భక్తవత్సలసాంబా ॥ 67

ఫాలాక్షా నీపదములు
చాలగభజియించునట్టి సద్భక్తులయా
పాలనలో ననుగొనుమిక
మేలును మఱిగలుగునీకు మిక్కిలిసాంబా ॥ 68

ఓయిమిన్వాకదాల్పా
నాయిడుములు బారదోలి నన్నేలుము య
న్యాయంబేమియొనర్చితి
నీయెడ యీయెడను దెల్పు నిజముగసాంబా ॥ 69

లాకేశ్వమివ్వబూనకు
దాకును గొమ్మివ్వలోన దలపకుమయ్యా
నీకగు బిరుదుకుభిన్నము
రాకుండునె యింక భక్తరక్షకసాంబా ॥ 70

ఎట్టికడురోగములకును
దిట్టపుయౌషధము నీదుదివ్యపదంబుల్
బట్టితివిడువక ననుయిక
నట్టేటనుముంచకయ్య నగపురసాంబా ॥ 71

కడుకష్టంబులుబెట్టక
చెడుగుణముల జేరనీక చిత్తముమరినీ
దడుగుల నిలువగ జేయుము
విడయక నీదాసులకును దాసుడసాంబా ॥ 72

లోకులసిరులకు నేడ్వక
లోకులహింసింపమనసులో దలపక సు
శ్లోకుని ననుజేయుము ము
ల్లోకేశ్వర శైలజాతలోలాసాంబా ॥ 73

నాపిల్లలు నాపెండ్లము
నాపాడియు నాదుపంట నాయిల్లంచున్
వాపోవుచుంద్రు మర్త్యులు
నీపైయింకెప్డు భక్తినేర్తురుసాంబా ॥ 74

తనసంతతి తనభాగ్యము
తనసౌఖ్యము తనదుకీర్తి తనభోగంబుల్
తనమురిపెమె సరిపోయెను
నిను నెప్పుడు గొల్చువాడు నియతిగసాంబా ॥ 75

ధనమున్న నాఁడె ధన్యుఁడ
నని పొంగుచునుండువాఁడు నవనీస్థలిలో
ధనమున నిన్ను నెఱుఁగఁడు
ధనవంతుని నెటుల బ్రోవఁదలతువొ సాంబా ॥ 76

కూళులయి మిగుల శతవ
త్సాలపనిని బ్రతుకనేమి లాభముగననే
నాలుగురోజులు బ్రతికిన
చాలదె నినుఁగొల్చునట్టి సగుణుఁడు సాంబా ॥ 77

దలపగ మూతినమీసము
మొలచినమాత్రమున వాఁడు పూరుషుఁడగునా
కొలిచెడి యుద్ధులకిష్వని
ఖలునకు మీసంబదేల కాల్చన సాంబా ॥ 78

పతిమాట విననిపడతియు
క్షితిలో గురువులనుదూరుశిష్యులు నాత్మ
స్తుతిచేమెలగెడు మనుజుం
డతులిత పాపములకెల్ల నర్హుడె సాంబా ॥ 79

కుడుచుటకు లేనివానికి
కొడుకులు బహుమందిజూడ కోటీసునకున్
నిడమొక్క పుత్రుడైనను
కడుచిత్రము నీదుమహిమ గాంచగ సాంబా ॥ 80

సుందరియైనను దన సతి
యందు కటాక్షంబుగలుగ దాయె పరస్త్రీ
యందున మనంబునిల్పుదు
రిందుధరా వారినెటుల నేలెదొ సాంబా ॥ 81

పనిబడి సంసారాబ్ధిని
మునిగియు దేలుచును పొంగిపొరలుచు నరకం
బున బడజూతురు నియతిగ
నినుగొల్వగ జాలరొకో నిముసము సాంబా ॥ 82

ఎన్ని శతకోట్ల విత్తం
బున్నను మరివిత్తవీగు చున్ననుగానీ
సున్నగదా నీభక్తికి
మిన్నగలదె మొద్దియేని మేదిని సాంబా ॥ 83

ఉదయమున లేచి నీదగు
పదముల భజియింప నెట్టి పాతకుడైనన్
ముదమొప్ప నిన్ను జేరుట
తుదకరుదా కల్మషంబు దొలగియు సాంబా ॥ 84

చారెడు నేత్రము మీసము
బారెడు రూపంబు బాహుబలుడై యున్నన్
ధారుణి నినుభజియింపని
వారికి కైవల్యమెట్లు వచ్చుర సాంబా ॥ 85

ఎంతటి మొనగాడైనను
కాంతకు దాసుండెసుమ్ము కవివరుడైనన్
స్వాంతమున దలచిచూడగ
యంతయు నీమహిమగాదె యవనినిసాంబా ॥ 86

ఎప్పటికైనను చావక
తప్పదుమానవుడు నీపదంబుల స్మరణం
బెప్పుడు గొలిచెడివాడిల
గొప్పఘనుండన బరంగు గొంకకసాంబా ॥ 87

యెంతటి తపసుండైనను
యెంతటి సుజ్ఞానియైన నిలజెడ్డైనన్
కాంతు జనకుండుగానీ
శాంతములేనట్టివాడు చవటరసాంబా ॥ 88

అవివేకికి బుధవాక్యము
చెవికెక్కున వేశ్యతనదుచేడియయగునా
కవివాక్కు రిత్తయగునా
శివశివయనువానిఫలము చెడునాసాంబా ॥ 89

పండితునకు పామరునకు
నుండును భేదంబుచాల నర్వస్థలిలో
దండియగు నీదుభక్తుల
కుండెనె భేదంబు తరిచివారిచిన సాంబా ॥ 90

అనిలో భారినవాడిల
ననిలేదనువాడు బెక్కుయాశయు గలవా
డును నోర్వలేనివాడును
నినుగొల్వనివాడుధరణి నీచుడుసాంబా ॥ 91

సుత్రామ వినుతగౌరి క
ళత్రాదుష్టాళి జైత్రలక్ష్మీధవు స
న్మిత్రా కోమలగాత్ర ప
విత్రా సుచరిత్ర వేదవేద్యాసాంబా ॥ 92

దండిగనిన్నుభజింప మృ
గండునిపుత్రుడగాను కన్నకుమారుణ్
ఖండించి విందుసేయు ఘ
నుండగు సిరియాళుబోలనోపనుసాంబా ॥ 93

లోభికి విత్తముగల్గిన
లాభముసుంతైనగలదె లావణ్యులకుణ్
వైభవములెన్నిగల్గిన
నీభక్తుని కెనయగలరె నిజముగసాంబా ॥ 94

ప్రమధగణేశ్వర యింద్ర
ప్రముఖామరవినుతపాద వనజమహేశా
హిమకర శేకర శ్రీకర
సుమశరసంహారణ కరుణజూడుముసాంబా ॥ 95

వ్రాసితి విఘ్నముగాకను
వ్రాసితి నీపైని కందపద్య శతకమ్ముఁ
జేసితి గైకొను బంగరు
పూసలు మాలికగ మెడనుబూనియు సాంబా ॥ 96

అకటా నరులకు కవితా
మకతల్లిని కృతియొసర్చి మాడలుగొన నొ
ల్లక నీకె కృతియొసర్చితి
ప్రకటితముగ నేను నిత్యభక్తితో సాంబా ॥ 97

కలి నైదువేల ముప్పది
కిలలో శుక్లాబ్దమందు నీశతకంబుఁ
పొలుపొందగా లిఖించితి
సలలితముగ గొనియు నొసగు సౌఖ్యముసాంబా ॥ 98

ధర నార్యూలసగోత్రుడ
చిరముట్లురి వంశజుండ శ్రీమహలక్ష్మి
వరతెనయుడ కోటయకవి
వరుడన బరగితని నీదుభక్తిని సాంబా ॥ 99

అనయము నీసాంబశతక
మును జదువుచు వినుచు వ్రాయుబూను నరునికిఁ
ధనకనక వస్తువాహన
మును తనయుల నిత్తువహహ ముదమునసాంబా ॥ 100

